పరస్పర మైత్రిఁగూర్చుట తప్పు; అట్లు కూర్చిన కవి "కుకవి యగు" నని ద్వితీయాచార్యుఁ డగు అథర్వణుఁడును చెప్పియున్నాఁడు. ఆ నియమముల ననుసరించి లఘురేఫాలఘురేఫములు వేర్వేఱుగా నుండుననియుం, వానికిఁ బరస్పరము మైత్రి లేదనియుం, నియమానుసారముగ అలఘురేఫమునకు లఘురేఫ మాదేశ మగు ననియుం గ్రహింపవలెను. ఇది సంజ్ఞాప్రకరణమున ౧౧-వ సూ. గా ఉండఁదగినది.

## సంధి

### 3. ద్విత్వరహితంబగు ద్వితీయావిభక్తి యుకారమున కచ్చు పరం బగుచో సంధి రాదు.

ఉ. నను నెఱిఁగె, నిను నెఱిఁగె మొ.

సంధి = సంధిపరిచ్ఛేదములోఁ జేర్పవలసిన సూత్ర మని భావము.

ద్విత్వముతోఁ గూడియుండని ద్వితీయావిభక్తిసంబంధ మగు ఉకారమునకు అచ్చు పరమగునపుడు సంధి రాదు.

'ననున్+ఎఱిఁగె, నినున్+ఎఱిఁగె' అనునప్పుడు బాలవ్యాకరణములోని 'ప్రథమేతరవిభక్తి శత్రర్థచువర్ణంబులయం దున్న ఉకారమున కచ్చు పరమగునపుడు సంధి వికల్పముగా నగు' నను సూత్రముచే వికల్పసంధి వచ్చి 'ననెఱిఁగె, నినెఱిఁగె' అని కావలసి యుండఁగా, అట్టి రూపములు కాకుండుట కీ సూత్ర మారంభింపఁబడినది. ఇది సంధిపరిచ్ఛేదమున మొదట నుండవలసిన సూత్రము.

ఇట్టిచోట్ల సంధి రానందున 'నను నెఱిఁగె, నిను నెఱిఁగె' అని మాత్రమే యుండును.

## సమాసము

సమాసము = క్రిందివి సమాసపరిచ్ఛేదమున నుండవలసిన సూత్రము లని భావము.

## ౪. తెలుఁగ సర్వనామంబుతోడం గర్మధారయంబు చూపట్టదు.

౧. కర్మధారయసమాసము సాధారణముగా 'ఆ-ఈ-ఏ' అను త్రికంబు కంటె వేఱగు సర్వనామముతోఁ గలిసినది యుండ దని భావము. బాల వ్యాకరణమున 'కర్మధారయంబు త్రిక, స్త్రీసమ, ముగంతధాతుజవిశేషణ పూర్వపదంబులు యుండదు' నని మాత్రము చెప్పఁబడుటచే దానిని వివరించుట కీ సూత్రము చెప్పఁబడినది. ఇది ౯-వ సూత్రమునకుఁ గాని ౧౦-వ సూత్రమునకుఁ గా దని తర్వాత నుండఁదగును.

## ౫. ద్విగువు మహదర్థఘటితం బదృష్టంబు.

౨. మహద్వాచకముతోఁ గూడిన ద్విగువు కానరా దని యభిప్రాయము. ద్విగువున సంఖ్యావాచక మగు విశేషణము విశేష్యముతోడ సమాసమును బొందుచుండును. 'ముజ్జగములు, ముల్లోకములు, నలుగడలు' మున్నగుచోట్ల రెండు పదములును అమహదర్థకములై యున్నవి. నలుగురు+వీరులు అనుచోట మహద్వాచకములే యున్నందున సమాసమున లే దని భావము. ఇది ౨౦-వ సూత్రమునకు ముం దుండ నగును.

ఇది ముక్తలక్షణవివేచనము.

సుబోధినీసహిత

త్రి లి ఙ్గ ల క్ష ణ శే ష ము

సమాప్తము.

---

# ఉదాహరణసూచిక

# సూత్రానుక్రమణిక



---

మదరాసు : వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్‌వారి
'వావిళ్ల' ప్రెస్సున ముద్రితము:—1972—కాపీలు. 2000